# నృత్యభారతి



## దశావతారములు

౧ మత్స్యావతారము
౨ కూర్మావతారము
౩ వరహావతారము
౪ నరసింహావతారము
౫ వామనావతారము
౬ భార్గవరామావతారము
౭ రామావతారము
౮ బలరామావతారము
౯ బౌద్ధావతారము
౧౦ కల్క్యావతారము
౧౧ అంకితము

★ ★

౧౨ జగద్గురు
౧౩ విద్యారణ్యస్వామి
౧౪ వాల్మీకి
౧౫ వ్యాసుడు
౧౬ నన్నయ్యభట్టు
౧౭ త్యాగయ్య
౧౮ గోపన్న
౧౯ జయదేవుడు
౨౦ నారాయణతీర్థులు
౨౧ క్షేత్రజ్ఞుడు
౨౨ సిద్ధేంద్రయోగి
౨౩ సంధ్యానటరాజు



"శ్రీ ధర్మపురి లక్ష్మీనరసింహా
దోయిలింతు మాం పాహి నృసింహా!"

నాట్యోద్దిష్టములైన గీతగోవింద కృష్ణలీలాతరంగిణీ కావ్యములు యావద్భారత ప్రసిద్ధములు.

నర్తకులు కృతులను సంకీర్తనములను క్వాచిత్కముగా నభినయించుట కలదు కాని, యవి సిద్ధేంద్రుని భామా కలాపము వలె క్షేత్రయ్య, సభాపతయ్య, సారంగపాణి పదములవలె నృత్యమున కుద్దేశించి వ్రాయబడినవి కావు.

ఈ రహస్యము తెలిసిన త్యాగయ్య యక్షగానములను రచించెను. శ్రీ మేలటూరు వెంకట రమణ భాగవతులు మొదలుగా తంజాపూరి కవులు యక్షగానములను బగ్గ కెత్తిరి.

కూచిపూడి భాగవత మేళముల నాట్యప్రదర్శనముల కాలంబనములు యక్షగానములే. ఈ భాగవతములనే నాటకములనియు వ్యవహరించుట కద్దు. తంజావూరికి సమీపమున మేలటూరు, శూలమంగళం, ఊత్తుకుడు భాగవతులు ఇట్టి తెలుగునాటకములనే నేటికిని ప్రదర్శింతురు.

మహనీయుల ఆరాధనమే ఇతివృత్తముగా వినిర్మింపబడిన ఖండ కావ్యసంపుటి నృత్యభారతి.

శ్రీమతి రుక్మిణీదేవి, హరీంద్రుడు, వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి గారలీ కావ్యమును విని అత్యంతము హర్షించిరి.

ఆంధ్ర నాటక కళాపరిషదధ్యక్షులు శ్రీ మేకా రంగయ్యప్పారావుగారు బందరు పరిషత్తు నిండుసభలో కావ్యపఠనానంతరము లేచి సెబాసని చేయి యిచ్చిరి.

అఖిలభారత రచయితల సంఘ తృతీయ సమావేశపు గోష్ఠిలో చిదంబర క్షేత్రములో ఆనంద తాండవపురనివాసి శ్రీ కుంచిత పాదం (తంజావూరి సమీపం) మా అరుణాచలకవి తెలుగులో అవతరించెనని ఆనంద బాష్పములతో కౌగలించుకొనెను.

శ్రీ రామకుమార్ వర్మ, ప్రభాకర మాచ్వే ప్రభృతులు ఆవృత్తములుగా వినిపించుకొనిరి.

శ్రీ ఏ. సి. గుహా మొదలైన వివిధభాషలలోని రచయితలు వారి లిపులలో దశావతారములను వ్రాసికొనిరి.

మరికొందరు నాగరలిపిలో యీ కావ్యమును హిందీ వ్యాఖ్యానముతో ప్రకటింపవలసినదిగా సలహాయిచ్చిరి.

మిత్రుడు శ్రీ 'తాండవకృష్ణ' ముందుగా 'నృత్యభారతి'ని తెలుగులోనే గ్రంథముగా ప్రకటింప ప్రోత్సహించెను.

నటరాజస్వామి అనుగ్రహమునకు నా నమోవాకములు. తెలుగులోని తీయందనమునకు నా కైమోడ్పులు, స్వస్తి.

— రచయిత



శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి
అధ్యక్షుడు:
విజ్ఞానసమితి - విజయవాడ

అదనుచూచి, నలుమోముల వేలుపు
నిదురలోన దొంగిలి తొలిచదువుల ;
వడివడివడి పరుగిడి నడికడలిన్
అడుగుమట్టమున నడరు సోమకుని ;
చిఱు చిఱు చిఱు చిఱు చిఱు మీనై
మెఱసి శరధి ముమ్మరమై ఘనమై
చుట్టుముట్టి పెనుచుట్టచుట్టి యట
మట్టుపెట్టినా మహనీయుడ ఓ....

—మత్స్యావతారా!



గిరికవ్వమై వాసుకి త్రాడై
సుర అసురులు పాల్కడలి త్రచ్చగా,
మొదలు కుదురకే కుధర మబ్ధిపడి
చెదరి అనేక మ్మదరి డిల్లపడి
హరి హరి హరి యని మొఱలిడగా
కరుణ విరిసి జలరాశి జొచ్చి యొక
కమఠమ్మై తన కర్పరమ్ముపై
నమ దుర్వీధర ముద్ధరించినా

—కూర్మావతారా!



జృంభిత మునిజన శాపరూపులే
కుంభిని పై కనకాక్ష కశిపులై
గండు మిగిలి, కనకాక్షుడు వరుణుని
చెండి, రసాతలమేగి, బంతిగా
నేలమోయు తొలికిటిని చివ్వకై
తూలి పిలువ; నతి ఘుర్ఘురతన్ పెను
కోఱకత్తులను చీరి రాక్షసుని
ధారుణి ధర్మోద్ధరణ మొనర్చిన

— వ ర హా వ తా రా !



ఏడి ఏడి హరి! ఏడిర డింభక
ఏడని కశిపుడు తన్నిన కంబము
దద్దరిల్లి పెళపెళ్లై రెండై —
ఉద్దవడిని నీవుగ్రాగ్రహమున
అడుగు నరుడు కంఠీరవ శిరమై ;
దుడుకు రక్కసుని తుటతుట చీలిచి
పెటిలు పెఠల్లను ప్రేవుల రొదలో
జొటజొట నెత్తురు గుటగుట త్రావిన
[illegible] — నరహర్యవతారా!



దాడివెడలి అమరావతిలోగొని
ఊడిగమున త్రిదశేశ్వరు నునిచిన
బలదర్పితుండు బలిచక్రవర్తి కే
వలుడై దిశలను దురాక్రమింపగ
యోచించిన నీవొక చిటి వడుగై
యాచించిన మూడడుగులు ఫలమై
ఒక్క పదమ్మె ఉర్వీనభమై
తక్కట బలి పాతాళముద్రొక్కిన

— వా మ నా వ తా రా!



తెగినతండ్రి జమదగ్నిని కని కని
పొగులు తల్లి రేణుక నూరార్పగ
ప్రతిన బూని, నీ బ్రాహ్మణధర్మ
వ్యతిరిక్తమ్మైనను నిశ్శంకగ
వాయినూరి పెను గండ్రగొడ్డలికి
ఆ యర్జును వేటాడియు తనియక
వెదకి వెదకి మత్తిల్లు అధర్మపు
పృథివిపతుల రక్తమ్మున జోగిన

! —భార్గవరామా!



చుప్పనాతి చెప్పుడుమాటల విని
తప్పుడు దశకంఠుడు పరవశుడై
విల్లువీగి ఉల్లూగిన తమిలో
వెల్లులెత్తి భూజాత హరించిన—
కట్టికడలి, లంకాపురి తృటిలో
ముట్టడించి, అనిమొన నెదిరించిన
హొంతకారి రావణు శీర్షమ్ముల
బంతులాడి ఉద్ధతుడై నిలచిన

—రా మా వ తా రా!



యోగమాయ సంధించిన తేజము
భోగి శేషునిగ పోల్చలేక నిను
అంతర మెరుగక అవజ్ఞచేసిన
పంతగించి కోపించి కౌరవుల
దంతి పురము జొత్తమ్ము ప్రమ్మూలము
వింతగ నాగటి కఱ్ఱున తేపుచు
గంగ త్రోవ ప్రముకట్టిన, వారలు
బెంగ సుక్కి ప్రార్థించిన, బ్రోచిన

బ లా భి రా మా !





ఏలూరు నాటక కళా పరిషత్సభలలో

శ్రీ హరీంద్రుడు - చంద్రలేఖ - సుబ్బరామశాస్త్రి

వేదచోదితము విశేషధర్మము
భేదబుద్ధి నూహించిన మూఢులు
తగనివారు యజ్ఞమ్ములు సలుపగ
తగుదుమంచు ఘోషించెడివాదము
పనిగొని ఖండింపంగ తలపడియుఁ
వినినవారు మోహోత్తచిత్తులై
వాదమ్ముల వాకట్టై పోవగ
వేదమ్ముల ధర్మమ్ము నిలిపినా

—బుద్ధావతారా!



పైడిపాటి ప్రాచదువుల ధర్మువు
వీడి ప్రజలు సంకరులై పోయిన
జలశూన్యమ్ములు మేఘములై
ఫలశూన్యమ్ములు క్షేత్రములై
తాండవింప దుర్భిక్షము—విష్ణుయ
శుండను విప్రుని కొమరుడవై
శంబళమున జన్మించి మ్లేచ్ఛులను
పంబిన వేడ్క—వధించి మించు—ఓ
—క ల్క్య వ తా రా !



ఇద్ధభూమి కృష్ణా తటమందున
సిద్ధేంద్రుడు ప్రజ్ఞానిధి వెలసిన
కూచిపూడి వీచిన పరిమళమై
తోచిన యీ నా నాట్యసరస్వతి
కబ్బురపడి నీ వౌనన లేదా?
సుబ్బరామ కవి సమ్రాడ్వరదా
శాయపురపు లక్ష్మీనరసింహా
దోయి లింతు మాం పాహి నృసింహా.



# జ గ ద్గు రు వు

బ్రహ్మదేవ నిశ్శ్వసితము వేదము
ప్రమాణబుద్ధిని పాటింపని ది
గ్దంతులైన పండితుల వాదముల
చెండి చెండి ఉద్దండత మెఱసిన
పరమహంస శ్రీ పరివ్రాజకా
చార్యా! పరమతఘోగుణధుర్యా
నాడు నేడు ఏనాటికి నైనను
అనుభవమ్ములో అఖండసత్యము
బ్రహ్మమె సత్యము జగత్తు మిథ్యని
భావాద్వైతము పంచిన కేవల
జగద్గురూ ! మా శంకరదేవా
రావో! ప్రణామమిదెకొనవో
పరమహంస శ్రీ పరివ్రాజకా
చార్యా ! పరమతఘోగుణధుర్యా!



# విద్యారణ్యస్వామి

తనువెత్తిన ఉత్కట కర్మం
అణువణువున వెలిగిన ధర్మం
భావించిన వైదిక నగరం
రూపెత్తిన విద్యానగరం
ఓమాధవ విద్యారణ్యా
నీమాదిరి యోగులు లేరోయ్!
నీదయలో దక్షిణదేశం
వేదమ్ములు నిలచు ప్రదేశం
నరబలికై మ్లేచ్ఛుల కత్తీ
ఒరలోనే నిల్పిన శక్తీ
అదిరా! నీతపస్సు పంటా
అదె! మోగెనురా జేగంటా!

ఓ మాధవ విద్యారణ్యా
నీమాదిరి యోగులెవరోయ్



# వాల్మీకీ!

ధరాతలమ్మున విరామమెఱుగని
మహాతపస్సున మహోత్తాలమై
పెఱిగినపుట్టను తరలిన తేజము
తమసానదితీరస్థమహావని
అనపాయత, మోహనక్రీడాగత
మధురజీవముల మిధున క్రౌంచము
చూచులోనె, నారాచము వదలిన
నిషాదుగురికిని విషణ్ణచేతము
గిలగిలగిల, మగపులుగొ మెలికలై
ఓడి నెత్తుఱులు వీడ ప్రాణములు
వ్యధాక్షుభిత గద్గదీకృతస్వర
గళితపత త్త్రిణి కాంచి ఋషీంద్రుడు
శోకించిన, సుశ్లోకమ్మై
ఆదికృతిగ, రామాయణమై

అందించితి గురుదేవా!
వందనమో వాల్మీకీ!



# వ్యాస మౌని

నట్టనడిమి రాతిరిగా
పట్టపగటి కల్పించుచు
మచ్చలేని కన్యాత్వపు
మత్స్యగంధి పరిమళమై
నది నడిమిని పడవ-ఒక్క-
గది, అంతఃపురమై
ఆగత చక్షువు ప్రాజ్ఞుడు
యోగీశుడు నిర్లిప్తుడు
పరాశరుని దృక్కులో వి
రాళి హేళి వ్యాసుడై—
పురాణముల్ రచించి మించి
విరాజిల్లి సూత్రమ్ముల
వేదమ్ముల భాగించిన
మాధవావతారా !

నమో వ్యాసమౌనీంద్రా !
నమోనమో నమోనమః



# నన్నయభట్టు

పూత గౌతమీ
వాతపోతముల
లాలించిన వ
జ్రాల నగరి, పా
లించి మించు, ధ
ర్మాంచితరూపము
రాజరాజు నీ
రాజన మెత్తిన
నన్నయఋషి, వి
ద్వన్నుతి పాత్రుడు;
చికాకు తెన్గుకు
ప్రకార మేర్పుకు
ప్రజాహితార్థము
ప్రారంభించిన
భారత సంహిత
మేరుతుల్యమై—



ప్రసాదగుణగత

రసార్ణవంబై -

ఆంధ్రవాణి కం

ఠాభరణమై -

రాజిల్లును నన్నయ్యా !

పూజలివే కొనుమయ్యా!



# త్యాగయ్య

నాదబ్రహ్మోపాసన చతురా
వేదాంత మహావిద్యాధీతా॥
అపరశారదా! అపర నారదా॥
నీ గళోదితము వాగమృతములో
ఊగె జగమ్ములు త్యాగరాజ ఋషి ॥నా॥
రామనామకృపా ఉ రామవిహారా
కృతి నీయది, సంగీత మధువురా ॥నా॥
జడుడైనను, కృతి యెడల లీనుడై
విడిన చీకటుల, విడియు సుఖమ్ముల ॥నా॥





ఏలూరు సాహిత్యమండలి వార్షికోత్సవ సభలలో
సాహిత్య, సంగీత, నాటక ఎకడామీల అవశ్యకతను గూర్చి
అధ్యక్షోపన్యాసం చేస్తున్న
శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి
శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణగారు, మండలి కార్యదర్శి

# గోపన్న

నీసరి భక్తుడులేడు; రామ
దాస ! ధన్యాతిధన్యుడవు॥
వేసారిపోయి, నానా సేవలను దస్సి
ధ్యాస రామునిపైన వీసము వీడవు ॥నీ॥
పాట సూటిగ యెడద మీటు - తెల్గు
నాటపాడని జీవిలేదు -
భద్రాద్రి రఘురాము
భజియించి తరియించి,
మారుమ్రోగితివీవు
మారుమూలలకూడ ॥నీ॥
కొడుకు గంజిని పడ్డనాడు, ఉసురు
విడచిన తుదిగడియకూడ -
వెడలిన దుఃఖమ్ము
కడుపున దిగమ్రింగి
కడుపునిండ ద్విజుల
కుడువబెట్టితివౌర ॥నీ॥

ఇవ్వ తేలిన అక్షలాఋ - చిల్లి
గవ్వ తిన్నది నీవుకాదు
భాగవతులకిచ్చి
భగవంతు మెప్పించి
పదిరెండు ఏడు, లా
పద చిక్క్ర సుక్కృతి ॥సీ॥



# జయదేవుడు

జయ, జయదేవకవీ కవీ కవీ
జయ జయదేవకవీ॥

జయ పద్మావతీ శోభిత! రసదీపితా!
రసదీపిత లాస్యవిశేషమహాభోగి ॥జయ॥

పుప్పొడి జల్లుల తోటలు : నీమాటలు
నీమాటలు కప్పుర మూదిన బాటలు ॥జయ॥

కేశవ రతిసుఖ రీతులు : నీగీతులు
నీగీతులు ఆమని కోయిలకూతలు ॥జయ॥



# తీర్థులు

స్వామి నారాయణతీర్థా! మృదు
పదకవితాచరణ పార్థా॥
బాలకృష్ణునిపయి పాట—పర
మార్థ తత్త్వపు రాచబాట
పున్నాగ పువ్వుల పేట—తెలి
వెన్నెల చలువలతేట:
జమిలి మల్లెలపూవుతోట—జంట
నెమిలి నృత్యముచేయు ఆట ॥స్వామి॥
ఎన్నటికి నిన్నెన్నువారికి
పున్నెముండును బన్నమందరు
వెన్నదొంగనుకట్టినన్నా!
సన్నుతించెద; రారన్నా! ॥స్వామి॥



# క్షేత్రయ్య

ఎవ్వరు నీ సరిరా! క్షేత్రయ్య!
ఎవ్వరు నీ సరిరా!
మువ్వగోపాలుని
మురువు చూపితివౌర॥

కూటమిలో కల గోటులు నీటులు
పాట పొందికలో వ్రాతలెల్లములాయె ॥ఎ॥

కలువరేకులజల్లు, కలకండ, నీపలుకు
కలికి పదము పట్ట పులక లయ్యె నవుర! ॥ఎ॥

బాల, ముగ్ధ, ప్రౌఢ: హేల లెన్నియొ చూపి
లీలాభిరాము, గోపాలు మెప్పించితి ॥ఎ॥



# సిద్ధేంద్రయోగి

ఆపత్తులో కృష్ణానదిలో మనస్సన్న్యాసం తీసికొనినది సిద్ధేంద్రుడనియే తెలుగు దేశములో ప్రచారములో నున్నది. కాని కొంద రీ వృత్తాంతము తీర్థులవారిదను చున్నారు. దీనిపై చర్చించి ఈ కథ సిద్ధేంద్రులదే నని బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారు నిర్ధారించిరి.

మదిరాక్షిని కలియుముహూర్తం
ఐది సమీపింప మైఆత్రిం
నది కడ్డపడిన మధువేళా
నది పోటెత్తిన విషవేళా
ఎద రేగినట్టి సంత్రాసం
మదిపూనినట్టి సన్న్యాసం,
తృటిని మఱచి చేచావి
తటపటాయించు సతిచూచి :
మఱపుతెలిసెనీ కౌలేరా!
ఎఱుకలోనె యోగివి లేరా!
నీ జన్మము కృష్ణాతీరం
కూచిపూడి అగ్రహారం
భరతమునివి లేరా!





లలిత నృత్యకళాసమితి ఆధ్వర్యమున జరిగిన
సిద్ధేంద్రయోగి ఆరాధనోత్సవములలో
అధ్యక్షత వహించిన శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి
శ్రీ తాండవకృష్ణ, వెంపటి సత్యం, వేదాంతం రామకృష్ణయ్య ప్రభృతులు

నటరాజువు లేరా!
ఔరౌరా ! సిద్ధేంద్రా !
ఔరౌరా ! యోగీంద్రా !
కైవార, మిదేరా
జోహారులివేరా.



# సంధ్యా తాండవము

నటరాజా !

నటరాజా !

తళుకుతళుక్కని గంగా

బొళుకుబొళుకు ఊగంగా

జటాఘటిత శశి

ఋతన్మధురగతి

అందమ్ములు నాలికేరా! నీ

చిందులోనె నటరాజా !

ఢమఢమ ఢమరుక ఢక్కానాదం

ఝణిఝణి మువ్వల ఝణఝణ ఝణఝణ

అందమ్ముల వెలిగేరా ! నీ

చిందులోనె నటరాజా !

నటరాజా !

నటరాజా !

వాణీప్రముదిత వీణాశ్రుతిలో

అజునితాళమై హరి మృదంగమై

విశేషమ్ముల చక్షుశ్శ్రవములు
అందమ్ములు తొణికేరా! నీ
చిందులోనె నటరాజా!
నటరాజా!
నటరాజా!

తద్ధిమికిట ధిమి తద్ధిమి నాదము
ప్రదోషవేళను చిదానందమై
అద్వైతము మధురానుభూతిలో
తనిసెనుగా జగదంబా
తనిసె తనిసె నటరాజా
నటరాజా!
నటరాజా!!



# ఇతర కృతులు

1 సుబ్బరామశాస్త్రి

గీతావళి

2 ఆంధ్ర జాతీయ గీతము

3 బాలవాణి (గేయములు)

4 నీలం (కథలు)

5 ఆంధ్రశ్రీ (పద్యములు)

6 ఉషాసుందరి (నాటకము)



చిత్రాలు : పుల్లేశ్వర్

కూర్పు ఒకటి

ముద్రణం : శ్రీ విష్ణు అండ్ కో (ప్రెస్)